787

[Ap]proved by the Text Book Committee of Madras
Part I B Fort St George Gazette of 8th April 1930 Page 230

# గర్వభంగము

ప్రచురణకర్త:
బండారు మోషే.

Price 8 Annas

6

టెక్స్టుబుక్కు కమిటీవారివలన అప్రూవు కాబడినది.

# గర్వభంగము

అను

## ఫెలిక్షియున్ వధ.

బాపట్ల, అమెరికను తెలుగు బాప్టిస్టు మిషన్ బోధనా
భ్యాసనశాలయందు సహోపాధ్యాయుఁడు
బండారు మోషే
విరచితము.

రెండవకూర్పు. 1000 ప్రతులు.

బెజవాడ:
ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
క. కోదండరామయ్యగారిచే ముద్రింపఁబడియె.

1931.



[వెల 8 అణాలు.

# భూమిక.

చిఱుతవయస్సునుండి హైందవ, క్రైస్తవపాఠశాలలయందు విద్య నేర్చితిని. ఎందుఁజూచినను నేపాత్రమును తిలకించినను భరతఖండమహాపురుషజీవ్యము నే యాంధ్రమునఁ బఠించితిని. నేఁడుపాధ్యాయపదవియందును చదివినకథలనే చదువుచు, నేర్చినపాఠములనే నేర్పుచుండ, నూత్నమగు నొక్కదానినిఁ దెలియమికి పాఠకులును విసుగునొందుచుండు టనుభవనీయము. ఇతరమతగ్రంథములనుండి యొక్కచిన్నిగాథను సామ్యముననైనను కానమికి విస్మయంబంది క్రైస్తవమతగ్రంథరాజమునుండి దావీదుమహాసీయుని బాల్యావస్థయందలి యొక్క శూరకార్యమును 'గర్వభంగ' మనుపేర నాటకరూపమున వ్రాసితిని. మీఁదట 1926 సం॥న దీని ముద్రించి స్వజాతీయు లుద్ధరింపని హేతువున నన్నాదరించు దయాసాంద్రులు లేరను వెఱ్ఱియూహతో కొంతకాలము మిన్నకుంటిని. ఎట్టకేలకు శ్రీ చెన్నపురి టెక్స్టు బుక్ కమిటీవారి దివ్యసముఖమునకుఁ బనుప, కరుణాసాంద్రులై యంగీకరించి, నిరాటంకముగ దీనిఁ బడులయందు వినియోగింప నగు నని 8-4-1930 తేదీని ఫోర్టుసెంటుజార్జి గెజిట్టు 230 పేజీలో ప్రచురించిరి. వీ రింతటి యాదరమును జూపినందుకు వందనసహస్రముల నర్పించి వారి యుపకారమును మిక్కిలి కొనియాడుచున్నాఁడను.

నా జాతీయులభాషాభివృద్ధికై దీని వ్రాసి, నా బాలమిత్రుఁడును, సహపాఠకుఁడును, సహోపాధ్యాయుఁడును అష్టావధానియు నగు శ్రీ దీవి రంగాచార్యులుగారి కియ్య, తా నా మూలాగ్రముగఁ దిలకించి సవరించినందుకు వారికిఁ బ్రీతిమై నమస్కృతుల నాచరించుచున్నాఁడను. ఈ గ్రంథకథానాయకుని చారిత్రమును జదివి మన యాంధ్రయువకుల సమానశౌర్యధురంధరులై దేశసేవఁ జేసి పుణ్యచారిత్రులై యలరారునటుల దేవదేవునిఁ బ్రార్థించుచున్నాఁడను.

ఏ. బి. యం. ట్రెయినింగ్
స్కూలు, భావపురి,
4—9—1930.

ఇట్లు బుధజనవిధేయుఁడు,
బంహారు మోషే,
(ప్రధానసహోపాధ్యాయుఁడు.)



# గర్వభంగము

## ప్రథమాంకము.

### 1 వ రంగము - రాజసభ.

(ప్రవేశము :— సౌలురాజును, విజయసింహుఁడును, అబ్నేరను సుయోధుఁడును ఉచితస్థానముల నలంకరింతురు.)

సౌలురాజు—వీరవర్యులైన యో సౌజన్యమాన్యులారా! భగవదాజ్ఞానుసారముగ నాయమాలేకీయుల నుఱుమాడి యుంటిమిగదా, వారి నృపాలుఁడగు అగగును దిట్టముగ బంధించి చెఱయం దుంచితిమిగదా! భళిరే! ఎంతటి విజయము!

సుయోధుఁడు—భూపాలా! చిరంజీవి వగుదువుగాత! తమ చిత్తానుసారముగ వర్తించితిమి. ఫెలిస్తీయులనృపుని కావలియందుంచితిమి. మఱియు దేవునికి బలినర్పింపనై కొన్ని బలిసిన యెడ్లను, పశువులనుగూడ భద్రపఱచితిమి.

రాజు—భళిరే! సంతసించితి. నేఁడు సమూయేలుమహాశయుండు మనయొద్దకేతెంచుననుట తథ్యము. యజ్ఞోప దీక్షచే ప్రజ లాతని రాకకై కాంక్షించియుండ నమ్మహానీయుఁడు రానికతమున మనమే యజ్ఞము సల్పితిమి. గిల్గా

లలో జయసూచక ధ్వజమునుగూడ నిల్పితిమి. ఆహా! పగతురపై దైవ మెంతటి జయము నొసంగెను!

(అనుచు విజయసింహునివైపుఁజూచి)

విజయసింహా! నీవొనర్చిన ఘనకార్యము లెవ్వియో వివరింపుము.

విజయసింహుఁడు—నిరుపమాన పరాక్రమవంతా! రాజాధిపా! త్వదీయాజ్ఞానుగుణ్యముగ పదివేల కాల్బలముతో నమాలేకీయుల కోటను ముట్టడించి తూర్పుగుమ్మమునఁ బ్రవేశించి,

ఉ॥ ధీరులఁ బెంచు నిక్క ఘనతీవ్రముతోఁ జెలరేగి తాఁకు నా
వీరుల నుక్కడించి యొక వ్రేటున వారిశిరంబులన్ సహో
దారుణ మత్క్రపాణమున ధారుణిఁ గూల్చితి కోటలోనికిన్
దూరి గురుప్రతాపమునఁ ద్రోలితి శత్రులనెల్ల నుద్ధతిన్.

రాజు—భేష్! భేష్! భవత్పరాక్రమ కృత్యంబుల కెంతయో సంతసించితిని. నీనామము సార్థకంబయ్యె. ధన్యుఁడ వైతివి.

(అబ్నేరువైపు జూచుచు)

వీరవర్యా! అబ్నేరూ! నీ వెటులఁ జెలఁగితివి?

అబ్నేరు—జగద్రక్షాధిపా! ఘనకులోద్భవా! నాటిసంగరమున నామ్లేచ్ఛనాయకులలో నొకని నుక్కడింప నమకట్టి యొంటిగా సాహసించితి. ఆమ్లేచ్ఛాగ్రేసరుఁడు మువ్వ రనుచరులతో నన్ను డాయనేతెంచి గంభీరలీలఁ బారొక్కనియె.

ధీరతతో నొక్కవేటునకు వాని యనుచరులఁ దెగటార్చి,
దుర్మతు నవలీల నేల విసరివైచి.

గీ॥ ఉరముపైఁ గూరుచుండి యత్యుగ్రలీల
నిశితఖడ్గంబు పైకెత్తి నీటు మెరయ
నో కృపాణమా! రుధిరంబు నోపినంత
ద్రాగుమని చెప్పి తుంచితి ధరను నేను.

రాజు—శూరాగ్రేసరులారా! మీపౌరుషమున కెంతయో
సంతసించితిని. దిగ్విజయులరై వర్ధిల్లుదురుగాత! ఆయు
రారోగ్యభాగ్యంబులు మీకెల్లకాలము చేకూరుగాత.

మఱియు, నాయమా లేకీయులు మగలఁ దలయెత్తి మన
లఁ దార్కొన నమకట్టియున్నారు కావున.

గీ॥ జాగరూకులై మెలఁగుడి సౌఖ్యముగను
సదయుఁడైనట్టి దేవుఁడొసంగు జయము
ఖ్యాతికై పోరి కాల్చుఁడి ఘనత మెరయ
నసువు లందాస మేటికో యనఘులార.

[హాఠాత్తుగా సమాయేలు ప్రవేశించుట
అందఱును విభ్రాంతితో లేచుట.]

రాజు—(నమస్కరించి.)

మహానుభావా! ఇదిగో తమస్థానము నధిష్ఠింపుఁడు;
తమరు మామధ్యనిలుచుటఁజూడ మా కెంతయో శ్రేయో
దాయకము.

సమూయేలు—భూపాలా! మీరెల్లరును క్షేమమా? గత సంగరమం దెటుల చరించితిరి?

రాజు—మేమెల్లరము జాగరూకులమై మెలఁగితిమి. శత్రు సైన్యములఁ దెగటార్చితిమి. తమ యనుజ్ఞను శిరసావహించితిమి. మేము దిగ్విజయ మొందుట మీ భాగ్యమేగదా!

సమూ—సర్వమును నాశనము చేసితివా? తథ్యమా?

రాజు—మహాత్మా! అటులే వర్తించితిమి. సమూల ధ్వంసము జేసితిమి.

సమూ—అనృతమాడఁ దగదు. సర్వమును హతముఁ జేసితి వని తెల్పుచున్నాఁడవు; అట్లగుచో,

గీ॥ సర్వకార్యముల్ నేర్పుగ నిర్వహించి
శత్రుసైన్యంబులెల్లను సంహరించి
దేవునాజ్ఞను గొనినట్లు దెల్పెదీవు
పసులు నజములు ని ట్లరువంగ నేల?

రాజు—(చిన్నవోయి మోము వాడ్చి) దేవరా! క్షమింపుఁడు. నే నాచరించినది దుష్కృతముగాదు. నాయనుచరు లరిచయము నుక్కడించుతరి దేవదేవునికి యజ్ఞ మర్పింపనై వానిఁ దెచ్చిరి.

సమూ—రాజాధిపా! నీవేల యింతటి అనృతంబులఁ బల్కుట? మానవుల కన్నులకు గంతగట్టనగును గాని పరమేశ్వ

రునికి మఱుఁగైన కార్య మెందుఁగలదు? మఱియు నీ కీయఁ
బడిన రాజ్యలో నట్టిభావ మెంతైనఁ గలదా ?

ఇఁక నీభాషణములఁ గట్టిపెట్టుము. నేను వచ్చు పర్యం
తము గిల్లాలులో వేచియుండుమని తెలుపలేదా ? గర్వ
మతివై నాయానతిని నిరాకరించి యజ్ఞ మాచరించితివి ? భూ
పతివైన కారణముననా యింతటి గర్వము ? దేవునియాజ్ఞను
పెడచెవిని బెట్టి అందు నీయాజ్ఞను కొంత సమకూర్చితివా ?
గర్వమతి నిటు వర్తింప భూపాలురకుఁ దగునా ?

ఆ॥ వె॥ నీయనుమతి మీరి నీకొగ్గు దలఁచెడు
నీచమనుజు నెల్ల నెపము దలఁతు
వటులె భగవదాజ్ఞ యాలకింపఁగ నుంట
ననుభవింపవలయు నతని శిక్ష.

కావున;

ఉ॥ ఓనరనాథ! తెల్పెద మహోన్నతుఁ డాదరణంబుఁ జూపుఁ దా
మానగ నిచ్చు నాఁతిని మన్ననఁ జేపడు మానుపాళితై,
ఆవతి నుగ్గడించి ధరయజ్ఞము సల్పిన నేమిచేసినన్
కానిమఁడు దాఁగినను గామనె దోసము పానుభూతితై.

రాజు—అనఘా ! యిది నేనొనర్చినది దుష్కృతమే. ప్రజల
సంతోషపఱుపఁ జూచి మోహావేశ యాజ్ఞను నిరాకరించి
తిని. ఈదోసమును గాయరాదా ?

సమూ—నీకేల యిట్టి దుర్బుద్ధి ? నేను వచ్చునంతవఱకు

వేచియుండుమని కోరఁగా నీవే యజ్ఞముసేయ సమర్థుఁడ
వైతివిగా ?

ఆ॥ వె॥ పరియాజ్ఞ వదసి యీరీతిఁ జేసితి?
వంటవాని చెనటి పల్కువినియు?
నీదుహాయము గాచు నీచుననుజ్ఞనా?
ధర్మమిదియె నీకుఁ దలఁచిచూడ? ॥

నీవొనర్చిన దుష్కృతములు రెట్టింపయినవి. అయమాలేకీయులను సంపూర్ణనాశము జేయక యందుఁ గొన్నిఁటి నాశించుట ప్రథమదోషము. నీవే సర్వాధికారివై యజ్ఞము సేయుట మఱియొక తప్పు. నీకిట్టి దుర్బుద్ధి యేలపుట్టెనో తోఁచకున్నది. యెహోవా దేవుని యాజ్ఞను విసర్జించితివి గావున నిశ్రాయేలీయులపై నిన్నునృపునిగాఁ జేసినందుకు ప్రభువు పరితపించుచున్నాఁడు. నిన్నువిసర్జించియున్నాడు. మెండియు,

తే॥ గీ॥ బుధులమనముల రంజించు బుధుఁడవంచు
పేదసాదలఁ బాలించు పెద్దవంచు
దైవచిత్తానువర్తివై తనరువాఁడ
వనుచు దలఁపఁగ సటుఁడవై మనఁగనౌనె?

సౌలు—అధిపా! ఏల తమకింతటి యాగ్రహము? నేఁజేసిన దోసమును మన్నించి మరలయజ్ఞముసేయ విచ్చేయఁ బ్రార్థించుచున్నాఁడను.

సమూ—నీవెంట యజ్ఞమును జరుపరాఁజాలను. నీవేపొమ్ము.

రాజు—అనఘా! నీవు నావెంట రానియెడఁ బ్రజలమదిలో నే నెంతయో చులకనిమనమ్ము గలవాఁడ నగుదును. అనుగ్రహింపక నా వెంటదయచేయుఁడీ!

సమూ—నీవెంట రా వలనుపడదు.

(అనుచు వెడలిపోవ సౌలుయొక్క చెంగుపట్టుకొనెను)

రాజు—ఇంతకఠిన వాక్కు లేల పల్కెదరు? శాంతమతులై నా వెంటరండు.

(అనుచుబతిమాలి చెంగులాగ నది చినుగును.)

సమూ—(ఆగ్రహముతో) కట్టా! భూపతులెంతటి ధూర్త వర్తనులు! అధికారమెంతటి భీభత్సదాయకము! ఎంతటి యల్పునికైన నొకింత యధికారమొదవఁగనే, మదోన్మత్తుఁడై మిట్టిపడుట సహజమేకదా! అట్టినృపుని పాలసమున బుధనుతు లూడిగపుఁబనిఁ జేయుచుండ యు దుర్జను లున్నతాసనముల నధిష్ఠించి న్యాయాన్యాయ వివేచనాశూన్యులై ధర్మమునడుగంటఁద్రొక్కి లంచగొండులై చరించుటయు నాశ్చర్యమా? అట్టిభూపతులు తమగోటితో భగవదాజ్ఞను మీటివేయుచున్నారు. అంతియేగాక;

తే॥ గీ॥ కొండెములు సెప్పి బ్రతికెడు కుమతు లాత్మ
సౌఖ్యమేగాని పేదల సౌఖ్య మెంత

మాత్రి మెంచక నీచులై మసలునట్టి
వారె రాజులసిరియులయి వఱలుచుందుri;

కుటిలవర్తనులగు భూపతులకు ముఖస్తుతియే జీవనము; సద్వర్తనము నేమాత్రమును బాటింపరు. అట్టివారినిజూచిన యాగ్రిహాచిత్తులై వారిపుట మార్చెదరు.

భూపా! యెంతటికార్యమును గావించితివి. ఇపుడీనస్త్రి పుంగాంగు చినింగినరీతి నీరాజ్యమును చినింగిపోవును. ఇట్టిధూర్తవర్తనము నీకుందగదు. చాలు, చాలు.

సౌలు—మీపరుషభాషణములచేత నన్నేల వంచించెదరు? ఎట్లులైనను నావెంటరాం బ్రార్థించుచున్నాండను. నాప్రజలలో అల్పునిగానెంచి చిన్నపుచ్చవలదు.

(అందఱు నిష్క్రమింతురు)

ప్రథమాంకము.

2 వ రంగము.

(సమూయేలు ప్రవేశించుట.)

సమూ—ఓకరుణాంబుధీ! కళ్యాణగుణాకరా! సాధుభక్తజనవత్సలా! భవదీయ పాదారవింద ధ్యానమునకై విచ్చేసితి. నాప్రార్థన నాలింపుము.

జననిగర్భమునుండి నన్నాదరించుచు అఖిలోపద్రవముల సంహరించుచు నేఁటివఱకును గాపాడుచున్న యోశరణాగతరక్షకా! మనవికై మిమ్ముడాయుచున్నాఁడ. మహార్తము చెవియొగ్గుము స్వామీ! నీయనుంగు బిడ్డలగు నిశ్రాయేలీయులను ఘాతుకుఁడును కిరాతుఁడును, మూర్ఖుఁడును, నిర్దయుఁడునగు నాఫరోయొద్దనుండి సౌఖ్యపయోనిధిని గాపాడుచు మార్గమునఁగల గర్భశత్రువులనెల్ల సర్వనాశనమునుగావించి యిచ్చోటకుఁ జేర్చితివి. ఇశ్రాయేలీయులెంతో దురపిల్లుచు మిమ్ము బతిమాల సౌలును ఱేఁడుగానొసంగితివి. ఇంతదనుక సమ్మహానుభావుఁడు నిన్ననుసరించియే వర్తించుచుండెను. ఎన్నఁడేనియు మీయనుజ్ఞలేనిది యొకచిన్నపనినైనఁ జేయ సమకట్టి యుండఁడుగదా! నేఁడైనను మీఘనమునకే గదా యిక్కృత్యమును జేయఁబూనెను. ఇపుడాతని నిషేధింప నేమిఫలము ?

గీ॥ ఉన్న సౌభాగ్యసంతతు లొకనియంద?
ఉన్న దుర్గుణపుంజంబు లొకనియంద?
కాన సుగుణదుర్గుణములు గలిసియుండు
నాగ్రహింపనేటికిఁ బరమాత్మ యిపుడు.

అదియునుఁగాక కలుషాత్ములపై కటాక్షరవిదీప్తిఁ బ్రసరింపఁజేసెదనని వాగ్దత్తమిడి యుంటివిగాదె! తత్కరుణాపూరితంబగు వాక్యము నొక్కమారు మదిఁదలఁపుఁడు. ఎట్టిఁ

గియో, యెఱుంగకయో చేసిన యీ చిన్నిదోసము మన్నిం పఁజాల కింతటి యాగ్రహపటురోషవహ్నిం దాల్చుట పాడి యా? ఈ యల్పనేరమును క్షమింపఁజాలరేని జగములు యుష్మత్ప్రతాపమున కభ్యంతరపడుదురేమో కదా! కొద్ది దోసమును గావనోపకున్న నింతకంటె పెనుదోసముల నెటుల భరింపఁ గలరు?

ఈశా! పతితపావనా! ఈమా ఆతని నేరములను మన్నింపుఁడు. రక్షించుఁడు. భవత్పాదధ్యాన పరతంత్రుఁ డనగు నామనవి నాలకింపుఁడు.

(తెఱలోనుండి)

అశరీరవాణి—భక్తాగ్రేసరుఁడవును, ఇశ్రాయేలీయుల కల్ప వృక్షమును, మత్ప్రియ శిష్యుండవునగు సమూయేలూ! వినుము.

నీవు సౌలుకొఱకై విలపింపవలదు. నేనాతని నిశ్రాయేలీయులపై భూపాలునిగాఁ జేసిన కారణమున దురపిల్లు చున్నాను. ఆతఁ డాచరించిన దుష్కృతము మన్నింపఁ దగదు. నేనాతని విసర్జించియున్నాను. నీవు దుఃఖించుట మాని వేగిరము లేచి బెత్లెహేమీయుఁడైన ఇషయియొద్ద కేగి యాతని కనిష్ఠపుత్త్రు నభిషిక్తుగాఁ జేయుము. పొమ్ము.

సమూ—ఓ ప్రభూ! మీయానతిని జవదాఁటఁజాలను. అయి

నను నేనా కార్యమును జరుపఁ జనునపు డద్దాని నృపుఁ
డెఱింగి నన్నుఁ గడతేర్చునేమోకదా! అతని యాగ్రహ
మునుండి తప్పించుకొనుటెట్లు?

వాశి—యజ్ఞోపదీక్షచే నీవాతని గృహమునకుఁ జనుము. అచట జరుపనైన కార్యముల నీకుఁ దెల్పెద.

సమూ—చిత్తము. అటులే వర్తించెదను.

(నిష్క్రమించును.)

---

## ప్రథమాంకము.

### 3 వ రంగము.

ఇష్షయి గృహము - (ఆసనముపైఁ గూరుచుండి)

ఇష్షయి—(తనలో) అబ్బబ్బా! వృద్ధాప్యమాసన్నమైనది. ఇంక నెంతకాల మీరీతిఁ బెనుకష్టములచే జీవయాత్ర గడుపవలయును? ఓ దైవమా! ఎంతముక్ఘట నెంతముక్ఘటము! ఈపాడు ఫెలిస్తీయు లెన్నఁడు నశింతురో కదా! "వినాశకాలే, విపరీతబుద్ధి" యను నార్యోక్తివలెనే వీరి నాశమునకే యిట్టి దుర్బుద్ధులు పొడసూపుచున్నవి.

భూపాలుఁడన్ననో వారితోఁ బోరసేరక పలాయితుఁ డగునటుల గన్పట్టుచున్నది. ఎన్నఁడు మాపై జాలిఁ జూపెదవో

కదా! మే మేయపరాధ మొనర్చితిమి? ఎంతకాలమీరీతి మానివై యుందువు? రమ్ము. నిరుపేదలమగు మమ్ముఁగరుణింపుము. సస్యనాశము గావించుచు, ముద్దుబిడ్డలఁ దెగటార్చుచు, గృహముల నగ్నితో దహింపఁజేయుచున్న ఫెలిష్టీయులబారినుండి రక్షింపవా! రావా.

(సమూయేలు ప్రవేశించుట.)

సమూ—ఆర్యా! శుభము! శుభము! ధన్యుఁడవైతివి. నీవు వంశపావనుండవు.

ఇష్షయి—(నమస్కరించి) తాము విచ్చేసినకారణమేమి? నాగృహమున కేదేని ముప్పువాటిల్లెనా? మీయాజ్ఞ నెవ్వైన జవదాఁటితినా? వివరింపుఁడు.

సమూ—సుమతీ! ఆనందింపుము. శుభవర్తమానమును దెల్పెదను. ఆవర్తమానము దేవుని యొద్దనుండియే వచ్చెను. గాని తద్వార్తనెందేని బయలుపఱుపకుసుమీ! ఏమనిన, మనరాజగు సౌలుపై దేవుఁడాగ్రహించి వేఱొకనిరాజుగా జేయ నిశ్చయించి యక్కతన నీకుమారులలో నొక్కని తైలాభిషిక్తునిగాఁజేయ నన్నుఁబంపెను.

కావున నీకుమారులెందఱో నిటకు బిలువనంపుము. నేనభిషిక్తునిగాఁజేయుదు. అతఁడిశ్రాయేలీయులకు ప్రభువై వారినేలును.

ఇష్ష—ఆహా! నాకంతటి పుణ్యము లభించెనుగా! (తనపుత్రు

బిలిచి) ఈతఁడే నాకుమారుఁడు నీయిచ్ఛానుసారముగ వర్తింపుము మహాత్మా!

సమూ—నీకెందఱు పుత్రులుగలరు? వారినెల్లఱ నిటకు రావించుము.

ఇష్ష—(ఆరుగురు కుమారులను బిలుచును.) వీరే నాతనూభవులు.

సమూ—వీరిలో నొక్కనినైన దేవుఁడు మెచ్చియుండలేదు. ఇంకెవ్వరైన పుత్రులుగలరా? ఉన్నయెడల వారి నిటకు రావింపుము.

ఇష్ష—కనిష్ఠుండు దావీదను నామాంకితుఁడు గలఁడు. అతఁడు కదాపులఁ దోలుకొని పర్వతసీమలం దుఁజరించుచున్నాఁడు. లేఁతప్రాయపువాఁడు. తమయిష్టమగుచో వానిఁ గూడఁ బరిశీలింపుఁడు. (అనుచు దావీదును బిలువనంప ఒడిసెలయు, గఱ్ఱయు చేఁబూనివచ్చి సమూయేలునకు నమస్కరించు.)

సమూ—సరియైన బాలుఁడీతఁడే. యెహోవాదేవుని మదిలో నున్నవాఁడీబాలుఁడే. సుందరాంగుఁడు. నాకోర్కె చేకూరినది. వీని నభిషేకించెద.

(తైలంపుబుడ్డిని చేఁబూని.)

సీ॥ ప్రభుఁడు తన బాహువునుజాపి శుభము లిడగ
ఆకసమునందు దూతాళి యలరుచుండ

ప్రీతి నభిషేకమందును ఖ్యాతితోడఁ
బరిమళము భవచ్ఛిరముపైఁ బర్వియుండ.
(అనుచు నభిషిక్తుఁగాఁ జేయును.)

(నిష్క్రమింతురు.)

గొల్యాతు సభామందిరము.

4 వ రంగము.

గొల్యా—భూరిశూరులారా! రణకోవిదులారా! దోర్వీర్యధనులారా! నేఁడు సమరభూమియందు మీ ప్రతాపముల నాకర్ణించి యానందభరితుఁడ నైతి. మీవంటి పౌరుషభీమణులు నాకడనుండ నే నెట్టివానినైన సమ్ముఖించఁగలను. ఇశ్రాయేలీయుల నతిశీఘ్రగతిని దునుమాడి వారిరాజ్యమును కైకొనఁగలసమర్థత మీయందు గలదు.

అజితవీరుఁడు—మహాశయా! అరిచయముపై నీవు జోరు సల్పుటగాంచి దిగ్భ్రమఁజెందితి. తమవంటి ప్రచండమూర్తుల నాధారముఁ జేసికొనియే మే మాలమును జరుపుచున్నాము.

గొల్యా—ఇప్పుడు మనశౌర్యములగూర్చి ప్రశంసించుకొనదగినసమయము గాదు. సంగ్రామము భీషముగా జరుగనున్నది. సేనలఁబురికొల్ప వేగిరపడవలసియున్నారము.

2. భటుఁడు—ప్రచండ ప్రతాపా! యేమిసేయవలయునో – తెల్పుఁడు. త్వరితముగ నిర్వహించెదను. ఇశ్రాయేలీయుల

నడుగంటఁజేసి వారి గర్వమడంచి వెట్టిచాకిరులకై వారి బాలికల గైసేయ నత్యంతాభిలాష గలదు.

3. భ—అధిపా! ఆలస్యమేల? యేమి యోచించుచున్నారు? నే నేప్రదేశమున నూటుండి మనశత్రువుల ధ్వంసము గావింపవలయును? దేవరవారు త్వరితగతిని సెలవొసంగిన నస్మత్ప్రతాపమును మఱియొకమారు వెలువరించి తమ యాదరమును బడసెద.

గొల్యా—మీ రాతురపడనేల? మన మాలోచింపనున్న కార్యము లసంఖ్యాకములు. వాని నతిరహస్యముగ భాషింపవలయు. (ఒకవంకదిరిగి) సేవకా ఒక్కసారి యిటు రమ్ము.

సేవ—(ప్రవేశించి) చిత్తము మహాప్రభూ! సెలవిండు.

గొల్యా—నీవు ద్వారముకడ నతిజాగరూకుఁడవై మెలఁగుము. ఎవ్వరేని పగతురు విచ్చేయుచున్నారేమో పర్యాలోకించుచు శీఘ్రగతిని నాకుఁ దెల్పుచు పొమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును.)

గొల్యా—శూరసేనా! గడచిన సమరమున నీ వాలస్యము నొనర్చియున్న బలాయితులమో శత్రులవాతఁ బడవలసిన వారమో యైయుందుము. దైవసహాయమున యాగ్నేయముగ నడచి శత్రుసేనల నతిక్రమించి జయపతాకము నిల్పితిమి. నేఁడు సంధికై రాయబారమంపి

యున్నారము. వారందులకు సమ్మతింపరేని నీవుప్రాగ్రి శకు వెడలుము. ఈ యజితవీరుఁడు నీ సేనల రణస్థలి కంపుచుండును.

అ. వీ—భూపా! కూర్రసేనుని ప్రాగ్రిశకుఁ బనుపఁదగదు. ఏలయన, మొన్నటి యర్ధరాత్రిమున నా యనుచరుఁడు వారి శిబిరముల కడకేఁగ వారేమేమో గుసగుసలాడు చుండ వాఁడారహస్య మాకర్ణింప వీనులొగ్గ, ప్రాగ్రి శకు నీ వరుగుమనుట చెవికిసోఁక, నింతలో వారి భటుఁడు నా యనుచరుని వెంటాడ, ప్రాణములఁ దక్కించుకొని నాకడ కరుదెంచె.

గొల్యా—వారే యాస్థానమున డాఁగియుండనెంచిరా? మఱి యొక రహస్యమును దెల్పెద నాకర్ణింపుము.

(ఏమో మాటలాడబోవ భటుఁడు ప్రవేశించి)

సేవ—(ప్రవేశించి) దేవరా! ఇశ్రాయేలీయుల నృపుని వద్దనుండి యెవ్వరో భవత్సందర్శనార్థమై వచ్చేసి యీ కమ్మను తమకిమ్మనిరి. తమతోఁ గొంత సంభాషింపవల యునఁట.

గొల్యా—(ఆశ్చర్యముతో) అతి రహస్యమును సంభాషించు తఱినే, సందేశకుఁడు వచ్చెనె! (ప్రకాశముగా) లేఖను చదువుము (అనుచు భటునికిచ్చును).

2. భ—(లేఖను చదువును.)

"ఫెలిప్తీయుశూరా గ్రేసరా! చిరంజీవి వగుదువుగాత! పల్కులు నీచేఁ బంపఁబడిన సందేశమున కనుగుణముగ మాయొద్దనుండి విజయశిఖామణి నంపుచున్నారము. చేయఁగల సకలసందేశముల సమర్థింపఁగల పరాక్రమ వంతుఁడు.

మీచర్యలు మఱియు చిత్తానుసారముగ నుండిన వటులే వర్తింపఁగలారము. సర్వమును శాంతముగ నివర్తించును గాత! అభివందనములు.

ఇట్లు,

సాలు భూపాలుఁడు."

గొల్యా—సేవకా! అతని లోనికిఁ బ్రవేశపెట్టుము.

(సందేశకుఁడు లోనికిఁ బ్రవేశించును.)

(సభ్యులెల్లరు నిలువఁబడుదురు.)

గొల్యా—మహాశయా! ఈస్థాన మలంకరింపుఁడు.

2. భ—(జనాంతికముగ)అజతవీరా! ఈతఁడెవఁడై యుండును?

అ. వీ—(జనాంతికముగ) ఇశ్రాయేలీయుల భూపాలునిచేఁ బోరి, నామమింకను దెలియదు. అడిగెదనుగాక (ప్రకాశముగా) అనఘా! తమనామ మెయ్యది?

రాయబారి—విజయసింహుఁడని వ్యవహరింతురు.

గొల్యా—నేఁడు మీరు మాసభ కేతెంచినందున మేమెల్ల

రము సంతోషవార్ధిం దేలుచున్నారము. సంధిసందర్భముల నెల్ల సావధానముగ ముచ్చటింతము. మీనృపుఁడు వృద్ధుఁడు సౌఖ్యముగ నున్నవాఁడా? ఎల్లరును సుఖముగ నున్నారా?

విజయ—ఔను. ఎల్లరును క్షేమమే! మీకునటులే సుఖానుభావము చేకూరుగాత! రణము భీభత్సముగఁ జెలఁగుచుండ క్షేమము లరయుట నగుబాట్లుగాదా. ఏకతమున మీరు మమ్ముఁ బిలువనంపితిరి?

గౌల్యా—సంధినిగూర్చి ముచ్చటించుటకే. ఏలన నిష్కారణముగ మీసేనలును మాసేనలును మడియనేల? శాంత స్వభావమున వర్తించుట దేశక్షేమము. బీదసాదల నుద్ధరించినవార మగుదుము. ఎందఱ నిందాకటూక్తులకుఁ బాల్పడుచున్నాము? ఎందఱు శాపవచనములు మనపై గుప్పించుచున్నారో కదా?

వి. సిం—ఆహా! ఇట్టిచింతనము సంగ్రామమునకు మున్నె యుండిన నెంతటి శ్రేయస్కరము! కానిండు. మేమును దానికి సమ్మతించుచున్నారము. త్రికరణశుద్ధిగ నట్లేవర్తింతము. ఏమార్గ ముత్తమోత్తమము?

1. భ—విశారదా! మీసంభాషణమున కడ్డమువచ్చినాఁడ నన్ను మన్నింపుఁడు. మీనృపుఁడు వృద్ధుఁడు కాఁడా? ఏరీతిని బోరుసల్పనోపును?

వి. సిం—మిత్రా! అటుల వచింపనేల ?
తే॥ గీ॥ జలధరములు దివాకరు నలముకొనఁగ
నంతరించునె భాస్కరుఁ డాకసమున ?
మండకుండునె అగ్నికి మసటుగ్రమ్మ?
నటులె యేహాని మాన్నృపు నంటకుండు.

2. భ—ఆహా! మీ భాషితములు విన నానందబాష్పంబులం కురించుచున్నవి. మీనృపునిపరాక్రమ మెటులున్నను, మీ పౌరుషము వర్ణనాతీతము.

3. భ—ఔనౌను! వీరు మహాబలశాలురవలెఁ గాన్పించెడి. ఇశ్రాయేలీయులెల్లరు పిరబలులవలెఁ జూపట్టుచున్నారు. గతదినమునందలి సంగ్రామమందు వారిప్రతాపము వెలువడినది.

వి. సిం—ఈప్రగల్భముల కేమిలెండు. ఒకయెడ నానందబాష్పములును, మఱియొకతరి విషాదబాష్పములును గూడ రాఁగలవు.

నాఁటి సంగ్రామమున నెవ్వఁడో యొకయోధుఁ డిరువురితోడ రివ్వునఁ దారసిల్లె. అంత వానియనుచరుల నుక్కడంచి, వారినాయకుని దారాన్కి యొక్క వ్రేటువేయు శిరము దెగుటకుమారు ఫాలభాగముజీలె; ఆగుఱ్ఱులొక్కటి నీనుడుటఁ గానంబడియెడి.

3. భ—ఏమీ! ఈప్రగల్భములు! ఎంతసాహస మెంతసాహ

సము! ఎంతనిర్భయము. ఇప్పుడు వచించినది మఱియొక మారు మాటాడుము! జాగ్రత! గతాసునిఁ జేసెదను.

వి. సిం—మీసభామందిరంబనియు, నెల్లఱు మీవారేయిందు గలరనియు మదినెంచి యిట్టి యనర్థమునకు సాహసించు చున్నారేమో! మాప్రాణములపై మాకాస లేదు. శత్రువులకు వెన్నిచ్చి పలాయితులము గాము. నన్నింటింజేసి నాకపకారముఁ జేయ నెంగితిరేమో! ఇదేచూడు నాప్రభావము (అనుచు కత్తిని దూసి 4వ భటునిపైకి తార సిల్లును.)

గొల్యా—వీరశిఖామణీ! ఘనకులోద్భవా! ఆఁగుమాఁగుము. శాంతింపుము.

(సభాసదులతో) మనకిదిపాడిగాదు. ఇపుడు మన మీది సల్పినను జగము లాక్షేపింపవా! ఎట్టి కార్యమునైన శాంతముతో సమర్థింప ధీవిశారదులకుధర్మము. ఇది సంధిసమయము. అనుచితముగా భాషించుటగాని, మరేమిసేయుట గాని తగదు. బలపరాక్రమములఁ జూపుకొన నిదియా సమయము?

వి. సిం—ఫెలిష్తియ శూరాగ్రేసరా! ఇఁక నేనిందు నిలుచుటనుచితము. సందేశమును సాంతముగఁ దెల్పుము. మీయభీష్టమును బూర్తిగఁదెల్పుము.

గొ—విజయసింహా! ఇదే నేదెల్పెడు సందేశము. నేదెల్పినటుల

మీనృపునితో ననుము. దీర్ఘకాలము రణమును సల్పుట మీకును మాకును దగదు. ఏల యీచిత్రవధ! దీర్ఘవైరము! ప్రజాక్షోభ! ఏల దేశముని ర్భాగ్యమై, నిర్జనమై, క్రూరమై, న్యాయవిహీనమై సర్వదా దురపిల్లుట! ఇటులఁజేసి ఏల జనాపవాదమునకుఁ బాత్రులము కావలయు? ఎందఱి సాధ్వీమణుల ప్రాణనాథులఁ దెగటార్చి వారియొక్కయు, వారిబిడ్డలయొక్కయు నుసురుఁబోసికొనవలయును?

అట్టికతన, నెల్లరము సంగ్రామమును మాని ముష్టియుద్ధము సేయుదము. ఎట్టులన; మీపక్షమున నొక్కబలశౌర్యధురంధరుని యుద్ధమునకు నాపైకిఁ బంపుఁడు. అతఁడు ముష్టియుద్ధమున నన్నోడించి విజయుఁడయ్యెనేని మారాజ్యమెల్ల మీకుగట్టియిచ్చి మీకు వెట్టిసేయుదుము. లేక నేనే జయశీలుఁడనగుచో మీరు నట్లె వర్తింపవలయును. ఇందులకు మీభూపాలుఁడు సమ్మతించిన సరి. లేనిచో నిఁకఁబోరుసల్పఁ జాలమని మాకు మీనృపుఁడు లేఖ—(ఏమో వచింపఁ బోవును.)

వి. సిం—(ఆగ్రహముతో) ఆఁ! ఆఁ! ఆఁ! ఏమీ యీ గర్వాటోపము! ఎంతసాహస మెంతసాహసము! ఇంతటి ప్రగల్భముల కిదియే ప్రతిఫలము. (అనుచు నందఱితోఁ గలహింపఁబోవుచు, పారిపోవుచున్న గొల్యాతునుజూచి)

శా॥ ఓరీ! యేమని పల్కెదీవు? కుమతీ! యున్మాదచిత్తుండవై
ఈరీతి న్నను నొంటిఁజేసి గెలుతన్ హీనాత్మ! నీశక్యమే
ఔరా పారెదవేల భీరునిక్రియన్ యాష్టీక గొల్లార్థ! రా
రా్రా చూడుమికే భవచ్ఛిరము నాఘోరాసి కర్తించెదన్.

ఇఁక నేనిందు నిలుచుట ధర్మముగాదు. శత్రులెల్లెడలఁ గ్రమ్మరుచుందురు. శీఘ్రగతిని నృపాలునికడకేఁగి యీ సందేశమును దెల్పెద. (అనుచుఁబోవ మార్గమున శత్రు లడ్డగింతురు.)

శత్రులు—నిలునిలు. ఓరీ దుర్మార్గా! ఎందుబోయెదవు? నేడు నీచావు నిశ్చయము. (వారితోఁ గలహించి తప్పించుకొని పోవును.) (నిష్క్రమింతురు.)

---

# గర్వభంగము

## ద్వితీయాంకము



(1 వ రంగము) - సౌలురాజు సభతీర్చి కూర్చుండుట.

సౌలు—మంత్రి సామంత విద్వజ్జనంబులారా! ఇదేటివింత! ఎన్నఁడేని యిట్టిదురవస్థలఁ బాల్పడమైతిమి. కాలవశమునో, విధికృతమునో, నేఁటికి నీచుల గెల్వనేరక యున్నారము. పరాజితుల మగుగతి సంప్రాప్తమాయె నని తోఁచుచున్నది. ఇది నిశ్చయముగా దేవునియాజ్ఞనుమీరి చరించినందుకు ప్రతిఫలముగాని మఱేమియు కాదు. ఎంత సంపద్విశేషోన్నతులచే విలసిల్లువాఁడైనను, దైవాశీర్వాదమించుకేనియు లేక విలసిల్లనేరఁడు. ఎట్టిలో నమాలేకీయుల జయించితిమి. ఈఫెలిష్తీయులను జయించుట కష్టమగుచున్నది.

సురో—రాజాధిపా! ప్రపంచమున నొక్కనికే విజయము చేకూరదు. ఒక్కమా రపజయము నొందినవాఁడు మఱొకమారు జయమునొందును. అంతియేగాక పూలుమోసిన శిరమున పుల్లలు మోయవలయునను సామెతగలదు.

నేటివఱకు జయమునొందిన మనమిప్పు డపజయమును బొందినను దుఃఖింపనగునా? అటులగాదు.

గీ॥ క్షితిని గలువు వీరోచితగతులు రెండు,
సమరముఖమునఁ దానైనఁ జచ్చుటొండె
మించి రిపుసైన్యములఁ బోరఁద్రుంచు టొండె
ఇంతియే కాని వేరొండు హేయమగును!

అబ్నేరు—ఎన్నఁడును వచింపరాని యనుచితముల భాషింపఁ గడంగితిరేమి? మీరలే యిటు లధైర్యము నొంద మా బోటివా రెంతటి దురవస్థనొందెదరు. ధైర్యము వహింపుఁడు. సాధనమున సర్వమును సఫలములుగాఁగలవు. ఎందఱుపుణ్యాత్ములు నెట్టనఁ బట్టుదలచే సఫలీకృతులయిరి.

సౌలు—స్వయంకృతాపరాధము! కిరీటధారణంబైననాఁటనుండి యసంఖ్యాకములైన రణములు సల్పియుంటిమి. ఎవ్వానియందైన నింతటి పరాభవమునకుఁ బాల్పడమైతిమి.

ఈ యవమానమును బాపి నన్నుఁ గృతార్థునిఁ జేయ సమర్థులెవరుగలరు? నేఁటితో నిశ్రాయేలీయులకు పరాభవ మంకురించినది. పతివ్రతలైన మనకాంతాలలాము లామ్లేచ్ఛుల పాలఁబడి దైన్యము నొందవలసివచ్చె. నేనిందఱి యుసురు పోసికొనవలసెగదా !

వి. సిం—హా! రాజచంద్రా! హా! దేవరా! (అనుచు తెరలో నుండి అరచును.)

రాజు—ఏమీ! ఆ దీనాలాపము. ఎవరైయుండనగును?

వి. సిం—హా! రాజచంద్రా! హా! దేవరా! (అనుచు రాజసమ్ముఖమునకు దుమికివచ్చును.)

రాజు—హా! విజయశిఖామణీ! ఏమీ యీరక్తధారలు. కట్టా! మృత్యువునోటినుండి ప్రాణములఁ దక్కించుకొని వచ్చేసితివా? శాంతింపుము. శాంతింపుము. ఇదిగో యీస్థానమునఁ గూర్చుండుము. (ఒకపీఠముపైఁ గూర్చుండు.)

అచ్చటి విశేషము లేమి? సవిస్తరముగఁ దెల్పుము.

వి. సిం—నేను సందేశమునకు వెడలితిని: అతఁడుచితాసనము నొసంగి యీరీతిని బ్రసంగింపఁ దొడఁగె.

ఓ విజయసింహా! మీ నృపుఁడు వృద్ధుఁడు ఇఁక మాతో రణమునఁ బోరఁజాలఁడు. కావున మాతోఁ జెలిమికై రమ్మనుము. లేదేని మీలో నెవ్వఁడేని ధీరుఁడున్నచో నాపైకి ముష్టియుద్ధమునకు రమ్మనుము. సన్నాతఁడు గెలిచెనేని మాసైన్య మంతటితో మీకు లోఁబడియెదము. లేదా, మీ రపజయమొందుచో మీరును అటులే వర్తింపవలయు. అటుల గాదేని మీనృపుని— అని యేమేమో యనుచితములు వచింపఁబోవ, నత్యాగ్రహమున నా కుఠారమును బ్రయోగింప నుద్యుక్తుం

డనై వారిపైకి లంఘింపఁ బ్రాణముల దక్కించుకొని వా రెల్లరు పలాయితులయిరి.

మార్గమున విచ్చేయుచుండ నచ్చటచ్చట దాగియున్న అరిచయములు ఘోరవిపినమునందలి కారుచిచ్చులమాడ్కి నన్నుఁ జుట్టుకొన నట్టె వెలువడి విచ్చేసితి.

రాజు—కట్టా! యెంతటివార్త వినవలసివచ్చె? హా! గొల్యాతుఁ డింతటి గండఁడాయెగా! ఆతఁ డింతటి బింకము లాడఁ దొడఁగెగా! ఏమిచేయను దోఁచదు. ఆశ్చర్యా! సైన్యముల వ్యూహపర్చుము. ఆతని సంహరింపవలయు. నేఁడు సంగ్రామమున మీ రెల్లరు మరింత ధీరతతో బోరుసల్ప వలయును.

భృత్యుఁడు—దుష్టశిక్షకుండవును, శిష్టరక్షకుండవును నగు యో నృపశిఖామణీ! [నేఁడు మన దండులోని కొక బాలుఁడు వెంచెను. అతఁడు యిష్షయి కనిష్ఠపుత్త్రుఁడు. ఆ బాలుని పేరు దావీదఁట. అతని సోదరులు మనదండులో కొలువు సేయుచున్నారు. గొల్యాతు నవలీలగఁ జంపఁగలనని బింకములు దీయుచున్నాఁడఁట.] తమ సెలవైనచో వాని నిచటికిఁ దీసికొనివచ్చెదను.

రాజు—సేవకా! అది వాస్తవమా? అతఁడు బాలుఁడా? అటులయిన వానితో నటుల యుద్ధమాడి జయింపఁ

గలఁడు ? అయినను చూతము. వాని నిటకు దీసికొని రమ్ము. పొమ్ము.

(సేవకుఁడు దావీదును తీసికొనివచ్చుట. దావీదు ఒడిసెలయు, చేతికఱ్ఱయు, దీసికొనివచ్చుట. రాజునకు నమస్కరించుట).

భృత్యు—రాజా ! ఇదిగో బాలుని తీసికొనివచ్చితిని.

రాజు—బాలుఁడా ! ఆమ్లేచ్ఛుని దెగటార్చెదనని బింకము లాడుచుంటివఁట, నీవేనా? పసిబాలుఁడవే ! అంతటి సాహసకార్యము నెటులఁ జేయఁగలవు ? బాల్యచేష్టలచే నిటుల బల్కితివి గాఁబోలు ?

దావీదు— రాజాగ్రగణ్యా ! నిరుపమానపరాక్రమప్రావీణ్యా ! మన శత్రుని జంపఁగల నని పల్కుచుండువాఁడను నేనే. దేవుని సాయమున నాతనిఁ బరిమార్పఁ గలను. ఎంతటి భీకరాకారుఁడైన నేమి భయము?

సుమో—బాలకా ! నీవు మిక్కిలి వదరుబోతువుగాఁ జూపట్టుచున్నావు. మన పగతుఁడు సామాన్యుఁ డని తలఁచితివా ? ఆరుమూరల జేనెడు యెత్తున నున్నవాఁడు. శిరము మొదలు పాదములవఱకు నుక్కుకవచము ధరించియున్న వాఁడు. అతని యీటె నేతగాని దోనెయంతటి దీర్ఘమయి నది. బహు భీకరాకారుఁడు. కావున విస్తరించి మాట లాడకుము.

దావీదు—ప్రతాపా ! ఏల మీకింతటి పిరికిగుండె ? భీకరాకారమునుజూచి భయపడు మీబోంటివారు యుద్ధ మేమి సేయనోపుదురు? వాని యాకారమునకన్న మీగుండెలు పదిరెట్లు భీకరముగా నుండవలయుఁ జుమీ ! మ్రానెంతటి ప్రచండమైనదైనను గొడ్డటిచేత భూతలముపై ద్రాలుచుండు టెన్నఁడును జూడలేదా ? వాఁడెంత ? వాని జీవమెంత ? ధైర్యము లేకున్న నేమిఫలము ?

రాజు—సుయోధా ! ఈపాపఁ డజములఁ గాయుచు నిచటికే తెంచియున్నాఁడు. చిఱుతప్రాయము. పోనిమ్ము. అయినను వీనిధీరత నేమనవచ్చును!

దావీ—నే నజములఁ గాయుచు నిచటికి వచ్చి యుంటి ననుట తథ్యమే ? ఇన్నిమాటలేల ? నన్నింతటి చిన్నమూపును జూడనేల ? వానిపై ముష్టియుద్ధమునకు బంపుఁడు. అపుడు నేను బాలుఁడనో, బాహుబలుఁడనో, మీరే తెలిసికొందురు.

రాజు—ఔరా ! ఏమి వీని పల్కులు! ఇది వదరుబోతుతనమా ? లేక వీని తెలివిని జూపుచున్నాఁడా ? బాల్యచాపల్యమా ?

ఉ॥ బాలుఁడ వీవు చూడ; ఘనబాహుపరాక్రమశాలి యాతఁడా;
గోలతవాఁ బల్కెదవు; గొఱ్ఱెలఁ గాయుట గాదు బాలకా!
మేలగుఁ బాలుఁబాలు నిఁక మెల్లన నింటికిఁ జేరపోయి గో
పాలక! వాఁడు చూడఁ బసిపాయమునుండియు నేర్చె యుద్ధముల్-

దావీదు—ఎందులకు నన్నలక్ష్యము సేయుచున్నారు? విస్తరించి పల్కుటవలన నదరుబోతునని పల్కుట న్యాయమా? ఆ ఫెలిష్తీయుఁడంత నెంతటివాఁడు గావలయును? మఱియు నన్ను గోపాలా యని యనాదరము సేయు టేల? ఘనులును గోపాలురే?

సీ॥ ఖడ్గప్రహారానఁ గాలగతింగన్న
యల్లహేబెలు చిన్న గొల్లగాఁడె?
ప్రాతమోసమునచ్చి ప్రఖ్యాతిగొన్నట్టి
కుటిలుఁడా యాకోబు గొల్లగాఁడె?
సాటిగొల్లలచేత సాధింపఁగాఁబడ్డ
ఘనుఁడగు యోసేపు గాఁడె గొల్ల?
పర్వతంబునఁ బ్రభు ప్రత్యక్షమునఁగాంచి
కడలిఁజీల్చిన మోషె గాఁడె గొల్ల?
తే॥ గీ॥ సకలకలుషంబు లేవేళ సంహరింపఁ
బ్రాజ్యమగునది యజరుధిరంబు గాదె
గొఱ్ఱెలను గాయునట్టి యీతుఱ్ఱవాని
గొల్ల యన నేనె? సింగంపుఁబిల్లగాని?

రాజు—ఏమీ! వీని వింతమాటలు! వీనిపల్కులు విన దేహము పులకరించుచున్నది.—నీవు కుఱ్ఱఁడవు గావు. పిడుగువురా! భళీ!

యుద్ధ మన నేమో యెఱుంగుదువా? ఎన్నఁడేనియు వీక్షించియుంటివా? దానిప్రతాప మిసుమంతయిన నెఱుంగవు? కొంత దెల్పెదను వినుము.

సీ॥ సంగరంబున ఘోరశస్త్రధారలె కాని
యజసమూహంబుల వరయ లేవు
ఖరఖురాగ్రములచేఁ గనికరంబును లేక
యుత్తరింతురెగాని యూరకొనరు
భేరీశంఖాధ్వనుల్ భీతిగొల్పునెగాని
బాలురు గానముల్ బాడ రచట
పలుతెఱంగుల నల్లవాహినులై పాఱు
గ్రోలఁజూచిన నీటిజాలు లేదు
తే॥ గీ॥ కరములను దీవ్రభల్లముల్ గానుపించు
రక్త మెందును జిందు నారావ మొందు
ఎచటఁజూచిన మృత్యువె యెంచిచూడఁ
బ్రేలవల దింక బాలకా! చాలుఁజాలు.

దాఫి—రాజాధిపా! ఇంతియేగదా! ఏమో భీతిగల్గింప యత్నించితిరా? లక్ష్యముసేయను. ఆటపాటలతో వానిఁ గాటికిఁ బనిచెద.

రాజు—ఓరీ! యుద్ధ మాటపాట లని యెంచితివిగా? మేషములఁ గాచుతరిఁ జెలికాండ్రిందఱును జేరి యాడు టని యెంచి అట్టిదే సంగ్రామ మనుకొంటివిగా!

సీ॥ బిల్లగోళ్లు లటంచు నుల్లసింపఁగరాదు
నిర్ఘాతసమబాణనిహతిగాని
చిఱ్ఱిపట్టెలనాడు కుఱ్ఱవారలు లేరు
కఠినాత్ము లెల్లెడఁ గ్రాలుచుండ్రి
గోలీ లటంచును గోరియాడఁగఁజూడఁ
బటుతర పాషాణ వర్ష మచట
కుక్కయాట యటంచు గులుకఁగా నెంచితో
ఘోరశూరులతోడఁ బోరవలయు
తే॥ గీ॥ దాఁగిమూఁత యటం చని తలఁపవలదు
యెందు డాఁగిన నిను వధియించువారె
నర్తనముగాదు ఘోరరణంబుగాని
ప్రేలవల దింక బాలకా! చాలుఁజాలు.

దావీ—ఈపల్కులెల్ల నాకు మఱింత నగవును గల్గించుచున్నవి. ఆఫెలిష్తీయాధమునకై యింతగా చింతిలుచు నన్నును భీతిలఁ జేసెద రేల? నేఁ జేసెడి రణము కృపాణములతోఁడగాని మఱొస్త్రానితోఁడగాని కాదు. యెహోవా దేవుని పేర సంగరమును గావించెద. అయినను నేఁ జేసిన ఘన కార్య మొక్కటి దెల్పెదను వినుఁడు.

మ॥ నిరతిన్ వీణియ మీటుచున్ గొఱియలన్ నేఁ గాచుచుండన్ గిరిన్
బరతెంచెన్ గురుభల్లుకంబొకటి విధ్వానంబుతో నంతటన్
గొఱియన్ బట్టఁగ వెంటనంటి కడిమిన్ గూల్పంగఁ వద్దాని జె
చ్చెర ఖండించితి; నిట్లె సింగమును నిర్జింపంగ నేఁగల్గితిన్.

దైవబలంబున వాళికరమృగంబులఁ జీల్చి, యుజరులఁ బ్రతికించిన నా కీర్తిమూర్తుఁ డొకరెక్కడయా? ఘాతుకమృగములనుండి నన్ను రక్షించిన యామహామహుఁ డీకిరాతునిచేతినుండి నన్ను రక్షింపఁడా!

కావున సుద్దులను గట్టిపెట్టి వానిపైకి కయ్యమునకు నన్నుఁ బంపుఁడు.

రాజు—వత్సా! నీధీరతకు మది యలరుచున్నది. నీ కింతటి సాహస మేల? ఇంతటిధైర్యము నొందుటకు హేతువేమి? నీకు వికలత్వమా?

దాపీ—హేతు వే మనదరా?

చ॥ ఒకరొకడ దేశభక్తి మతియొక్కరుడగు స్వజనాభిమానమిం
కొకటభరింపరాని వికటోక్తులతో రిపుమన్యుతంబులుగ్
సకలజనంబుసాధమున సైపఁగఁజాలక యుంటి నెవ్విధిగ్
వికలుఁడనౌదునో యధిప! పీరున కెన్నఁడు భీతిల్లునే?

రాజు—ఔరా! ఇంతటి సాహసపరులు దేశమం దుండుట మనభాగ్యమేగదా! దిఱుతప్రాయము లెందఱట్టి ధీరులు గలరు? వీని సునయోక్తులు మదిని భేదించుచున్నవి.

బాలకా! నీ కేమిఫలము లభించు నని రణమున కుద్యమించుచున్నావు.

దాపీ—ప్రతిఫలముగోరియా దేశసేవఁ జేయుట? అట్టినీచుఁ డెన్నఁడును వృద్ధినొందఁడు. అభిమానహీనుఁ డేగదా ఫలా

చేయుఁడు. ప్రతిఫలముఁగోరుట వంచనీయము. అయిన నొక్కటిగదా ఫలము!

తే॥ గీ॥ సమరభూమిని ప్రాణముల్ సమసిపోవ
శాశ్వతంపుఁగీర్తితోడుత స్వర్గ మొందవు
అటుల గాదేని దిగ్విజయమవ్రిదుండ
నని నుతింతురు భూవరు లతులభక్తి॥

యుద్ధమునకు బంపుఁడు. జీవముగల దేవుని సైన్యము-ధిక్కరించు నాఫెలిష్టీయునిఁ డెగటార్చెద.

రాజు—భళిరే! వీనిప్రతాపము, త్యాగము, ప్రశంసనీయము-మనంబున నానందంబును, నచ్చెరువును జనించుచున్నవి. వీఁడు బాలుఁడు గాడు. బాలుఁడుగాఁ జూపట్టెడి.

అయినను వీని శౌర్యమును జూతము.

(సేవకునివంక దిరిగి) ఓరీ! సేవకా!

(సేవకుఁడు వచ్చును) యుద్ధకవచపుగదికిఁ జని మదీయ కృపాణమును, యుద్ధకవచము నిటకు దెమ్ము.

(సేవకుఁడు తెచ్చును)

(దావీదుతో)బాలకా! వీని ధరింపుము. నీవు వానితోఁ ఘోరతరి పగతుని బాణప్రహారముల నవలీలం దొలంగఁ గలవు.

దావీ—(వాని ధరించి) రాజా! శూలములతోఁగాని, భల్లములతోఁగాని సంగ్రామముఁ జరిపిన జయమొందు టరుదు.

దైవమే నేఁడు రణము సేయును. రాజా! మీకవచములను,
ఆయుధములను తమయొద్దనే యుంచుకొనుఁడు. అవి నాకు
సరిపడలేదు. ఘను లెట్టులఁ జయించిరో తమ రెఱుఁగరా?

సీ॥ యెరిఖోజయంబుకై యెలమి యెహోషువ
యెట్టిసాధనము చేపట్టి గెలిచె?
గిదియోను శూరుండు కీర్త్యుజ్వలుండునై
యెట్టిసాధనము చేపట్టి గెలిచె?
నధికకీర్తిని గాంచినట్టి దెబోర తా
నెట్టిసాధనము చేపట్టి గెలిచె?
దాయల దుదుమాడ ధన్యుఁడౌ సంసోనుఁ
డెట్టిసాధనము చేపట్టి గెలిచె?
తే॥ గీ॥ అట్టిఘనుల నెందఱినో తా నరసినట్టి
ప్రభుఁడు నెమ్మిని నన్ను చేపట్టి నడుప
గెలువవలె తుచ్ఛులగు కిరాతులను నెలమి
నిట్టి డాల్ పట్టి, నేచిట్టి పట్టి నయ్య. *

రాజు—బాలకా! నీ మృదుభాషణములును, శౌర్యాతిరేక
మును మదినెంతో సంతసింపఁ జేయుచున్నవి. నీయిచ్ఛా
నుసారముగ గోల్యాతుపైకి నాలమునకుఁ జనుము. యెహో
వా నీకు జయమొసంగుగాత! ఇదిగో దీవించెదరమ్ము.

తే॥ గీ॥ శుభము లొనగూర్చు దైవంబు సుఖ మొసంగు
సకలకళ్యాణము దవ్వు నో శౌర్యవంత

సదయుఁడైనట్టి దేవుఁ డొసగును జయము
నిత్యసత్కీర్తి నెగడుము నిపుణతముఁడ.

ముద్దుకుఱ్ఱఁడా ! నీ వెందుసంచరించినను దైవము నిన్నంటి కాపాడుఁగాత! దిగ్విజయుఁడవుకమ్ము. జయముతో మరలరమ్ము. (నిష్క్రమింతురు)

## ద్వితీయాంకము.

---

### 2 వ రంగము.

(దావీదు యుద్ధమునకు బోవుచు ఒడిసెలచేఁబూని సెలయేటి లోనికి వచ్చి రాళ్ళు నేఱికొనుట.)

(తనలో) ఈదినమున మ్లేచ్ఛుఁడగు గోలుని వధింపవలయును. భూవరేణ్యుఁడు నన్నాశీర్వదించి యున్నాఁడు. ఏలొకో తా నిట్టి యపజయమునకుఁ బాత్రుఁడు. ప్రథమమున నమాలేకీయుల నవలీలఁ జయించెను. ఫెలిష్తీయులఁ జయింపఁజాలకున్నాఁడు. గోలుని దెగటార్చితినేని దేశసేవఁ జేసినవాఁడనౌదు. నాయొడిసెలయం దుంచుకొనుటకై కానఁబడుచున్న సెలయేటిలోనికిఁ బోయి కొన్నిరాలనేఱికొనియెద. (కాలువను సమీపించి.)

ఆహా! యీయేటి సొం పేమనఁదగు! జలములెంత స్వచ్ఛములు! ఇరుపార్శ్వములనున్న తరువులు మహోన్నతములై యుండ వికసితకుసుమములు తమ నెత్తావులను

[illegible]దుంత [illegible] ఎంతెరో కాంతిల్లుచున్నది. [illegible]యొక్క సీతలును, ఏదినుండి వెలువడు- [illegible] నెంతెరో యనేకాఘుకులై మనంబు- నెంతెరో సంతసిలఁ జేయుచున్నవి. మరియు మార్గాయా- సము నొందిన తెరువరుల కెంతెరో సంతోషము నొడఁ గూర్చుమార్గమై యున్నయది.

ఇందలి నిర్మలోదకమునుజూడఁ గన్నులకుంపువై గగన మున కాటపట్టనం దోచుచున్నది. అటులఁగాదు. నభోంత రాళ మీనోయములందుఁ దనఛాయలఁ జూచుకొని మురి యుచున్నటులఁదోఁచెడిని. జలధులపై దేలుచున్నయిందీవర ములలోని మకరందమును గ్రోలనై ఝుంకారములు సేయు చున్న భ్రమరసంచయములెంతో శ్రోత్రోత్సవముగావిం చుచున్నవి.

దీని జన్మస్థాన మెచటనున్నదోగదా! దీని సెలయేర నఁదగునా? ఇందలివి నిర్మలోదకములా? సందేహము! సాధుభక్తావళి తమతృష్ణఁ దీర్చుకొను దివ్యామృత సారమో యన యెహోవాదేవుని పెరటిలోనుండి ప్రవ హించుచున్నది. దప్పియున్నవార లెందఱీ నిర్మలోదకమును ద్రావి తృషదీర్చుకొనిరోగదా? అసంఖ్యాకములగు జల చరము లిందు హాయిగ నెట్లు వసించుచున్నవో చూడుము. అవిగో, మీనములెట్లు నిర్భయముగ చెల్లాటలాడుచున్నవి!

నే బిందే కాలయాపన మొనర్పఁదగదు. గోదావరి జం బనై కొన్నిరాల నేటికొనవలయును. నేఁడు పాషాణమవు లీరాళ్ళతో నడుగంటుచునుగాక. (రాళ్ళనై దింటి నేటి కొనుడు) ఈరైదురాళ్లు చాలును. వీని సౌందర్యమేమి? (ఒక రాతినిఁ బరీక్షించి)

ఓరా! ఇది శిలయా! కాదు, కాదు. మారెడ్డి? మానవజీవనము పావనంబగుటకై నైదు ముఖ్యగుణవిశేషము లుండవలయును. అవేవన! దేశాభిమానము, స్వజనాభిమానము, మతాభిమానము! ధీరత, భగవంతుని యందు విశ్వాసము. వీనికితోడు తన దేశమును బాలించు క్షోణీనాథులపైఁ భక్తి. దీనినే రాజభక్తి యందురు.

ఇపు డీచిన్నరాయి దేశాభిమాన మనుదానితో సమము. దేశాభిమానమునకై తమ ప్రాణముల గోల్పోయిన నారీరత్నము లెందఱోగలరు. ఎందఱు నీచమానవు లభిమాన మొకింతయు లేక పరుల పాదసేవఁ జేయుచుఁ దమమాతృభూమికి కళంకమును దెచ్చుచున్నారు.

ఉ॥ తా నివసించునట్టి ఘనధాత్రిపయిన్ బటుభక్తి లేని య
వ్వానిది జన్మమే యతఁడు వాయసలీల జరించుటే కదా
హీనగుణాధ్యులార! వినుఁడీ తలపోయుఁ ద్వదీయపాత్రిణముల్
మానము గోలుపోయినను మానుటయొప్పను నన్యుఁ గొల్చుటల్.

పోనిమ్ము. వా రారీతి జరించినను దమయాత్మగౌరవమును గాపాడుకొనఁదగదా? ప్రతిమానవున కొంకొంత

యాత్మగౌరవము గలదు. అది వానిఁ బాసిపోవునేని యాతఁడు జీవచ్ఛవంబుగాక మఱేమగును?

రెండవదానిఁ బరీక్షించెద:— ఒకదానిమించి మఱొకటి జూపట్టెడి. ఇది స్వజనాభిమానమనుటకు సమ్మతము. పెక్కండ్రు మూఢమానవులు ధనమార్జించియో, వాక్ప్రౌఢిమవలననో, మఱెవ్విధినో యొకింత అధికారము నొంది తన వారలను ధిక్కరించి యింక దమకన్న మిన్న యెవ్వరును లేరని గర్వాంధులై కెరలిపడువా రెందఱుగలరు?

గీ॥ నెమ్మిపింఛమ్ముఁగలుగు కాకమ్మువగిది
ఘనకులోద్భవుఁడనై వడి గర్వమునను
నెల్లరను మించినట్టుల యుల్లమందు
తలపఁబోకు ధూర్తుఁడ నీకు తగదు, తగదు.

ప్రీతిదియు వర్ణనాతీతమే! ఈతాయు, మతాభిమాన మనదగు అస్మన్మాతృదేశము. సర్వమతోన్నతిని జెంది భద్ర ప్రాప్తికిఁ గల్పతరువై చెన్నలరారుచున్నది. యెహోవాయే మన రక్షకుఁడు. మన మాతని యనుంగుబిడ్డలము. యెహోవాయే నిజదైవము.

ధీరతయునన దెంతటి భాగ్యవిశేషము! ధైర్యమున నెదు రాడి జయింపఁగలవాఁ డెవ్వఁడు? రణస్థలియందు నిలిచి తమ పగతుల భీకరాకారములఁ జూచి భయకంపితులై దిగులొంది వెనుకంజవేయు పిరికిపంద లెందఱుగలరు? కార్యసాఫల్యము

నకు దృఢచిత్తమే మూలము. కార్యసాధన మొందువాఁ డొక మారు పూసెజ్జపైఁ బరుండును. ఒకచో శిలాసంచయమే పూల పాన్పుగ బరిగణించును. ఒకయెడ శాకాన్నపానములును, మఱియొకయెడ ఘృతామృతసారములును భుజించును. చలి గాలులకును, వడగాడ్పులకును నోర్చి నిందల భరించుచు పగతుని క్రూరతిరస్కారముల నతిక్రమించుచు తలఁచినది సఫల మగునంతవఱకును నన్నిఁటిని సమభావమునఁ జూచును.

ఇటు దలఁపఁగఁ నేమిఫలము: ధూర్తుఁడగు గొల్యాతుఁడు మనల వెక్కిరించుట కేమికతనము? నిర్జీవములగు శిలలఁ బూజసేయువాఁ డఖిలసృష్టిలయకారణభూతుఁడగు యెహోవా దేవుని వెక్కిరించుటయా? ఎంతవిపరీతము!

నా దేశస్థితిని దలఁప మది ఖేద మొందుచున్నది. నే నీ కార్యమును సాఫల్యమును జేయ నేరకున్న రాజచంద్రునకు పరాభవముగల్గు. రాజ్యమెల్లను నిష్కారణముగ పగతునికి గట్టియిచ్చి యిఁక మాకన్న నిర్భాగ్యులు లేరనుటకు గారణ మగు నాస్వజనుల నఖిలదుఃఖములపాలు జేసి దుర్భరశాప పాత్రుఁడ నగుదును. చెనఁటులు మఱింత చెలరేగి ఘోర కార్యముల సల్పుదురు.

అక్కటా! మాతృభూమీ! నీ కీ దురవస్థయేల? నీయం దుద్భవిల్లిన వీరవర్యు లేమైరి? ఏల పరరాజులఁ బాల్పడవలసివచ్చె? మ్లేచ్ఛులును, విగ్రహారాధకులును

నున్నతిలేనివారు నగు ఫిలిష్తీయాధములు నీకిట్టి యగచా ట్లొనగూర్చుట! ఓ పుణ్యక్షేత్రమా! ఎన్నఁడును పర మేశ్వరుని ధ్యానము మఱవని యాజకావళి నీలో గుమ్మ రుచు పద్మవిలసత్సరోవరమువాడ్కి విరాజిల్లుచుండె యెల్ల లోకములకు భక్తవత్సలు పూదోటయునిపించుకొను నీలో నేఁటికి ఘాతుకమృగములు వసింపవలసివచ్చెఁగా!

సీ॥ సాంబ్రాణిపొగలు నాచ్ఛాదమా నీలోన
సంగ్రామధూమముల్ చాలగలిగె
సింహాసునాదముల్ వింపారు నీలోన
నార్తరావంబులవార్త సెలఁగె
క్షీరముల్ తేనియల్ పొల్లి పారక కట్ట!
రక్తధారలచేతి సిక్తమయ్యె
శ్రీమ్మకోవిలలచేఁ జెలఁగెడు నీ విప్ర
నిర్జనక్షేత్రమై నెగడవలసె
గీ॥ సజ్జనాళికిమారు దుష్టసంచయంబు
కరుణరసపూరితులుగాక క్రౌర్యమతులు
చెలఁగుచున్నారు నూడు మో కలువపృథివి!
యెన్నినాళ్లకు నీ కింక పున్నె మొదవు?

పరితపింపవలసిన పనిలేదు. నా శక్తివంచన లేక కృత్య మును బూనెద. ఓ ప్రభూ! జయము నొసంగుము. ఓరీ! మ్లేచ్ఛా! నీ వెంతటివాఁడవురా! నిన్ను గెల్చుటొక

లెక్కయా ! దాస్యవృత్తినుండి విడిపించిన యా పరమాత్ముఁడు నన్ను గెల్పింపకుండునా!

జయము నిశ్చయము. ఫలితమేమి ? సౌలునృపాలుని పుత్రిక. ఓహో ! ఓహో ! రొట్టెవిరిగి నేతఁబడినది.

అయింతి చేమంతిబంతి, రతనాలదొంతి. ఆజాణ హాయులు, రూపలావణ్యాతిశయములు, వర్ణింప నేరితరము! అయిననేమి ? అగ్రిజన్మమున నుద్భవమై, రాకుమారియై నిత్యసౌభాగ్యసంపదలచే విలసిల్లు నా మేలుబంతి యేడ ? విటపకుటీరవాసినై తీక్ష్ణభానుకిరణప్రహారములచేతను, వడగాడ్పులచేతను దహింపఁబడి కురూపినై పర్వతాగ్రములందు గదుపులవెంబడి క్రుమ్మరు గోపాలుఁడనగు నేనేడ ? ఆ చిగురుఁబోఁడి నన్ను వరించుననుట నగుబాట్లుగాదె ? అయిననేమి ? అతివలమనము లతి చంచలములు. ఇంతుల నమ్మరాదు. ఆ మృదుభాషిణిఁ దలఁప మది చపలమును జెందుచున్నది. అదిగో ఆనినదము లేమైయుండనగును? భ్రమరము లాకమలానన యొద్దనుండి నాకై వార్త దెచ్చుచున్నవా ?

కాంతాలలామలమది నెఱింగి వర్తింప గలవాఁ డెవఁడు? పసిపాపల భాషల నెఱుఁగనగును. పుట్టంధునకు నేత్రములు గాన్పించునటులఁ జేయనగును. భగవంతుని కార్యసంఘట్టనములఁ దెలిసి వాని వివరింపనగును. కాని వారి

మన సెఱుంగ నేరితరము? అక్కటా! యెంతటిమర్మహృద
యలు? అది యటుండనిమ్ము. నెలఁతలు కాలాంతకలా?
లేక పురుషపుంగవులు దుర్మార్గవర్తనులా?

గీ॥ తనను నిరసించుకాంతను తా నె వలచి
చిత్తచాంచల్యమున దానిఁ జేరఁబోయి
కడకు నిందలపాలయి కలుషియగుచుఁ
బడఁతుకలు మిత్రియ లటంచుఁ బలవరించు॥

ఇదియే తథ్య మని నామదికి పొడచూపుచున్నది. ఎటు
లైనను విరిఁబోణులు వంద్యనీయలే? ఎట్టులన,

చ॥ సరస నయానుభావమునఁ జాలిని గుల్కెడు వాక్యపాళిచే
మఱియుచు కాంతుఁ జేరి ముదిమోదము నెంతయు పాదుకొల్పి తో
డయనుసహించి దౌష్ట్యమున దగ్గరి కల్లర సంహరింతురే
కరణిని నమ్మఁగాదగును కాంతలు హంతకురాండ్రు చూడఁగన్॥

అబ్బబ్బా! లలితాంగుల మనోగమనము దెలియుటకై
యెంత యోజించిన నంతవిపరీతముగ నుండును. ఏల వారి
కీలాటి విపరీతపు మనసు!

ఉ॥ ఇంగిత మెస్వాంతమందు చరియించు మనోహరుఁజేరఁజేరి యెం
తెంతయు సంఘటిల్లినను తెంపునఁ బ్రాణము లిచ్చిపోయెదు, రా
చెంతలఁగోరి వారిదరిఁజేరెడివారికి నెట్టివేళఁ గా
లాంతము దెచ్చిపెట్టెదరు న్యాయమ కీ దేమొకో భూతలంబునన్.

ఛీ! ఛీ! ఛీ! ఏల యీలాటిచపలహృదయలను నిర్మింప
వలయు? పుణ్యపురుషాళికి వీరు గాలములవంటివారుగా ని·

ముఖోత్కటిగాదు. అయిన నొక్కరహస్యముగలదు. చకిత హరిణేక్షణలు కేవలము వంచనీయ లని వచించుచు వారి నతినీచలగ నెంచి యెట్టకేల కట్టివారి చెలిమిగోరని మానవుఁ డెందుఁగలఁడు? (కొంతసే పాలోచించి) కాదు, కాదు. అన్యకాంతలతో నా కేల ? రాజు తనపుత్రికను నా కిచ్చి పరిణయ మొనర్చు ననుట తథ్యము.—

(హఠాత్తుగా విరుద్ధభావసూచనముతో)

అయ్యో! నే నెంతటి పాపకర్ముఁడను. నే నెంతటి వ్యాకులుఁడను? ఇంతలో నేల మందభాగ్యుఁడను కావలసివచ్చెను? ఓసీ! దుష్టమనసా! ని న్నేమిచేసిన పాపముబోవును? వాఁడిఖడ్గముతో శకలములుగ ఖండించినను దోసమున్నదా? చేతికి దొరికుదానవు కావు. లేనియెడ ని న్నిపుడేమి చేసియుందునో కదా!—

ఈలాటి చిత్తచాంచల్యమునకు సైతానుఁడే కారణభూతుఁడు. ఓరోరీ! ఇట్టిమన సెంతటి విఘ్నమునకు హేతుభూతము. ఓరీ! వైరీ! సైతానా! నీచమత్కార మేమనదగు! అహా! యేలాటి తరుణ మారసి నన్ను గోతఁద్రోయనమకట్టి యిట్టివిపరీతపుబుద్ధిని బుట్టించితివిరా? ఛీ! ఛీ! అతిదవ్వునకు వెడలుము. నీలీలల నే నెఱుంగుదును.

గీ॥ నాఁడు హవ్వ యొంటిఁ జరింప నయముమీఱ
తనకడకు నెమ్మదిగ నేఁగి తగనిఫలము

**[illegible] సెల్లి తిరముగ మత్తి నిలకు**
**[illegible]ఁజేసిన పాటిదిశ.**

ఓరీ! నీవే వరపుత్రుఁడగు సంసోను మహాబలుని మోహ జలధుల ముంచి దెలీలాఘాతుకురాలిపాలఁబడఁజేసి వాని కన్నులూడబెరికించి కడకు వాని ఘాతునిఁజేసితివి. నీ కెఱు గెఱింగి వర్తించు మహానుభావు లెందరైననుగలరా? అటు లయిన నీవింతటి సాహస కార్యమును బూనఁజాలవు. ఎంద ఱు నాబోటి యువకులు నీపాలఁబడి మడిసి యున్నారో కదా!

ఓ యువకబృందమా! ఇదిగో నే సౌఖ్యహితవును దెల్పెదను వినుఁడు. వినుటే కాదు. ఆవిధిని చరించుఁడు. లేనిచో మీనాశము మీరే తెచ్చికొందురు. జాగ్రత సుండీ!

గీ॥ కలఁడు మీవైరి సైతాను ఘాతుకుండు
ఉచితసమయము వెఱింగి ముహూర్తమాత్ర
మునను పాడుసేయును మన ముమ్మరంపు
బ్రతుకుఁ గాన మేల్కాంచుఁడి హిత వెఱింగి.

కష్టా! యీదురాత్ముని యుక్తిచే నెందఱు నరకప్రాప్తులగుచున్నారు! మఱియు దేశసేవాకాంక్షితులైన యువకసమితిని హఠాత్తున మోహపాశములఁ దగిల్చి కార్యభంగము గలిగింపఁగల ఘాతుకుఁడీ సాతానుఁడే.—

ఇంక చాలును. బుద్ధివచ్చినది. నే నిట నిల్చుట కార్య భంగమునకు గారణము, ఈ దురాత్ముఁడు నన్నెపుడో పాడుసేయుననుట తథ్యము. శక్తికొలఁది వీని చేఁజిక్క వర్తించెద.

ఫెలిష్తీయభటుఁడు—ఎవరచ్చట? ఓ యిశ్రాయేలీయులారా! రండు, రండు. మా సైన్యాధిపతితో ముష్టియుద్ధమునకు వచ్చు బలశాలిని త్వరగా బంపుఁడు.

దావీ—(ఆశ్చర్యముతో) ఏమీ, యీ గంభీరస్వరము, ఎవఁడో ఫెలిష్తీయుఁ డిటు వచ్చుచున్నాఁడు కాఁబోలు.

ఫె. భ—ఓయీ! ఆలస్యము చేసెద రెందుకు? యుద్ధానికి రమ్మనిన రారేమి? మా యధికారితో పోట్లాడలేరా? లేక యుద్ధము మానుకొన్నారా!

దావీ—అహా! ఎంతటి తిరస్కారముతో నఱచుచున్నాఁడు. మా నృపుఁడు వీని జయింప లేకుండెనా? దేశమందలి వీరు లేమయిరి?

శా. లేరా యేమన శౌర్యశౌర్యనిధులు లేరా దశోరాసముల్
లేరా బాహుబలాఢ్యులు న్నలరా మహోత్సాహులై
ఘోరారావము సల్పెడు శైలము సేకుంటే నౌర నోయీరో
నా దేశము నుద్ధరింప వడి మీ ప్రాణంబు లర్పింపరే.

ఎవఁడో మిక్కిలి వదరుచున్నాఁడు. నేఁడు వాని జీవము వాని బొందిలో నిలువదు. (అనుచు ఫెలిష్తీయభటునిఁ జేరఁబోవును.)

ఫె. భ—(దావీదును సమీపించి) అబ్బాయీ! నీ వెవఁ

దవు? ఎక్కడికి పోవుచున్నావు? గొఱ్ఱెలను గాచు
కొనుచు నిటు వచ్చితివా యేమి?

దావీ—నే నెవ్వఁడనో, యొందుకు వచ్చితినో నీ కేమిగాని,
యిపుడు కేకలు వేయుచున్నది నీవేనా?

ఫె. భ—నేనే.

దావీ—ఏమని వదరుచుంటివి?

ఫె. భ—మా సైన్యాధిపతితో యుద్ధమునకు వచ్చువారెవరో
తెలిసికొనుటకు వచ్చితిని.

దావీ—అటులైన నిపుడు మీనృపుఁ డెచటనున్నాఁడు?
ఆతని నిటు దీసికొనిరమ్ము. ఒక్కమాట మాటాడవల
యును.

ఫె. భ—ఏమని చెప్పెదవు, మా నాయకుని నిక్కడికి
తీసికొని రావలెనుగా?

దావీ—నీకు ప్రతిభాష లేల? నీ స్తరు లెత్తి వేయుమనిన జనాభా
లెక్క నడిగెదవేల? మీనాయకు నిఁ దీసికొనిరమ్ము.

ఫె. భ—అబ్బో! వీనియొద్ద నెంతున్నది!

దావీ—నాయొద్ద నీయొడిసెలదక్క మఱేమియు లేదు. నీతో
మాటలేల? ఆ కనుపించు నతఁడేనా మీ నాయకుఁడు?
అటులైన నేనే పిదలెద.

(అనుచు మార్గమున బోవును.)

ఫె. భ—ఈ కుఱ్ఱవాఁ డెట్టివాఁడో గాని కాలాంతకుఁడుగా
నున్నాఁడు. నన్ను లెక్కసేయకుండనే పోవుచున్నాఁడే!

(విష్క్రమింతురు.)

## ద్వి తీ యాం క ము .

### 3 వ రంగము.

(గొల్యాతుఁ డాయుధపాణియై ప్రవేశించుట)

గొల్యా—నాభటుఁ డింకను రాలేదు. ఏకారణమునవో యింతటి యాలస్యమును జేసెను. (వంగిచూచుచు) ఎవఁడో బాలుఁ డిటకు వచ్చుచున్నాఁడు. వాఁ డిశ్రాయేలీయుల బాలుఁడుగాఁ జూపట్టెడి. (దావీదును సమీపించుచు.)

బాలకా! నీ వెవఁడవు? నీ పేరేమి? ఏహేతువుచే నిటకు వచ్చితివి?

దావీ—మా భూపాలుఁడు నీతో నొకమాట చెల్పుమనెను. అందుకై వచ్చియుంటిని. నాపేరుతో నిపు డేమిపని ?

గొల్యా—అటులయిన మీ రా జేమని వార్త బంపెను? తానే యుద్ధమునకు వచ్చుచున్నాఁడా? లేక మరెవ్వరి నైన, బంపునా?

దావీ—నీతోఁ బోరుటకు నన్నే పంపెను. తాఁ దెల్పెడు వార్త యేమన, యుద్ధముచేయక యే నిన్ను దునుమాడి రమ్మనెను.

గొల్యా—ఓరీ! నీ కెంతపొగరు! నాతో హాస్యము లాడవచ్చితివా ?

దావీ—నీతోడనా పరియాచకము లాడుట ? పగతురతో నెన్నఁడైన చెల్లాటలు గలవే?

గొల్యా—అటులయిన నొంటరిగా డాసేల?

దావీ—ఒక్కఁడనుగాక మఱెందరు రావలయు? నీ వంపిన సందేశానుగుణ్యముగ నే నొక్కఁడనే విచ్చేసితిని.

గొల్యా—ఒడిసెలయుఁ గోలయుఁ జేఁబూని విచ్చేసితివి. నన్ను శ్వానమని యెంచితివా! యుద్ధాయుధము లేవి? నీ విట్టులఁ బోరఁగలవు?

దావీ—ఈయొడిసెల సామాన్య మని తలఁచితివా! ఇందుంచుటకు రాళ్లును గలవు. వీని ప్రతాపమును చెప్పెదను వినుము.

గీ॥ భటచయముగాఁగ నా చేతివడిరాళ్లు
అందలిశిలయె ప్రభుని సాయంబుగాఁగ
శకటుఁడవు నీవు గురిపడ శక్తిగాఁగ
ధ్వంసమొనరింప నే నొంటి వచ్చియుంటి.

గొల్యా—శూరా! నీపొగ రేమనవచ్చు! మీజాతేమి నాపేరు విన్నమాత్రాన సింహనాదమునకు లేళ్లు బెదరురీతిఁ దల్లడిల్లుచుండ నీ కేల భయము లేదు?

దావీ—ఒక్కవిధమున నాకును భయమగుచున్నది. ఇంతటి దీర్ఘకాయుఁడవైన నిన్ను చిన్నతేలు మన్నించిన నెట్లుందువా యను భయమొక్కటి మఱేమియు లేదు. ఉడుత పిదల్పులకు వేఁములు గదలునా?

గొల్యా—నీమలతో నింతటి సంవాదముఁ జేయుట నాదే లోపము. నాభీకరాకృతి, నాకంఠధ్వని నాభుజబలమునుజూచి భీతిలేక యఱచుచున్నావా?

దావీ—తే॥ గీ॥ సీటుఁ దేలెను పెనుకొండ నీకు తనువు
గాలిపసిఁగిఁ పుకేలకగణి సిదు

కంఠనాదము పోలుపారు, కయ్యమునను
నిన్ను నెదిరింపఁ జన్న యో నీచ నాకు?

నీవు ధరించిన ఆయుధములు చెట్టునంటిన బెరడుతో సమము.

గొల్యా—బాలకా! నాయుద్ధాయుధముల వర్ణనను మీరా జెఱింగింపలేదా? శిరస్త్రాణము రాగితో నమర్పఁబడియున్నది. భుజములమధ్య తామ్రభల్లమును జూడకున్నావా? నేధరించిన కవచ మైదువేల తులములభారము గలదు. నాపాదరక్షలు నట్టివే. నాకరమునగలయీటె యాఱు నూర్ల తులముల యినుముతోఁ జేయఁబడెను.

దావీ—ఓహో! నీయాయుధముల పరాక్రమ మటులుండ నిమ్ము. నా చిన్నరాయియు. నేను జేసెడి పనిని జెప్పెదను వినుము.

తే॥ గీ॥ ఎఱ్ఱఁగా గ్రాంకిపిన మంతేని సాంద్ర
మైన, దహియించు నవలీల నగ్నికణము
అట్టిచందాన నీకవచాదులన్ని
నష్టపాలుగఁ జేయు నీచిట్టిరాయి.

గొల్యా—దుర్మార్గా! నీకింతటి కావరమేల? నాకు బలములేదని తలఁచుచుంటివా?

దావీ—నే నటులఁ జెప్పితినా? నీకు బలముగలదు. కాని దాని వినియోగించుమార్గ మెఱుంగవు. ఒక్క హితవుఁ జెప్పెద వినుము. బలాఢ్యుఁడవైనను, ధనసంపన్నుఁడవైనను గానిమ్ము. విఱ్ఱవీగకుము. అహానిని దురహంకారాగ్రము

విని యోగింపుము. చపలుఁడవై కీడు సేయకుము.

గొల్యా—అహా! యెంతటి గండఁడవురా! బాలుఁడవని యింత వఱకు దయఁ జూపుచుంటిని. దాని గ్రహింపక మిక్కిలిగ వదరుచున్నావు.

గీ॥ చాలు చాలును బాలుఁడా పేలవలదు
సుద్దులను గట్టిపెట్టు నీ బుద్ధి దెలిసె
ప్రార్థనము జేసికొను మింక ప్రాంజలివిగ
చావు సిద్ధించె నేఁడు నిను బ్రోవ నెవఁడు?

నేఁడు నీదేవుఁ డెవఁడడ్డగించునో చూతము.

(అనుచు నాయుధముల సవరించుకొనును.)

దావీ—చండాలా! వినుము. నీతో యుద్ధమునకై విచ్చేయు చుండ కాకోలములును, గ్రద్దలును, జంబుకావళియు నన్నుఁ జేరి బాలకా! మా కన్నదానము జేయు మని జాలి గొలుప నాకు మనవిసేయ, వానికి ని న్నెరగా నిత్తు నని వాగ్దత్త మిచ్చియుంటిని.

అంతేగాక ఈ దినమున యెహోవా నిన్ను నాచేతి కప్పగించెను. ఇశ్రాయేలీయుల దేవుఁడే నిజదేవుఁడని జగము తెఱుంగునుగాత. కృపాణములతోఁడగాని, భల్లములతోఁడగాని యెహోవా యుద్ధమాడఁ డని యెఱుంగుము.

ఇదిఁగో చంపెదను చూడుము.

(అనుచు ఒడిసెలలో రాతినుంచి విసరుట గొల్యాతు చచ్చుట. అతిరయమున నేగి వానికత్తితో శిరముఁ దెగ వేయుట). —

## ద్వి తీ యాం క ము.



### 4 వ రంగము - సౌలు సభామందిరము.

రాజు—అబ్నేరూ! రుద్రభూమియం దొక బాలుడు చరించుచు నేడు గొల్యాతు నెదుర్కొనఁ బోవుటఁ గాంచితి. అతఁ డెవఁడో నీ వెఱుఁగుదువా?

అబ్నే—రాజాధిపా! నా కిసుమంతయిన దెలియదు.

రాజు—అటులయిన వానివృత్తాంత మారయుము. పొమ్ము.

(అబ్నేరు నిష్క్రమించి దావీదును తీసికొనివచ్చుట.)

దావీదు—(నమస్కరించుట.)

రాజు—(దావీదును చూచి) బాలకా! నీ వెవని కొమరుఁడవు?

దావీ—భూపాలా! నాతండ్రి బెత్లెహేమీయుఁడు. ఇష్షయియను పేరుగలవాని కనిష్ఠపుత్రుఁడను. నా సోదరులు తమ దండులో కొలువుచేయుచున్నారు.

రాజు—(ఆశ్చర్యముతో) వత్సా! నీ వీ రాక్షసరూపి నెటులఁ దెగటార్చితివి?

దావీ-తమ యాశీర్వచనము నంది వాని నెదుర్కొన వెడలితిని. నన్నాతఁడు చూడఁగనే యాగ్రహచిత్తుఁడై పరుషభాషణములతో నన్ను దూరెను. వాని కాపాదమస్తకమువఱకు కవచము నిండియుండెను. ఏమిసేయుదు నాయని విచారింప వానిముఖమున సేలాఁటికవచము లేనికతమున నొడిసెలలో ఱాతినుంచి గిఱ్ఱున విసరివేయ నది శరవేగమునఁ బోయి వానిఫాలభాగమునఁ దగులుటతోడనే క్షోణితలముపై వ్రాలెను. కడువడిని వానిఁ జేరఁబోయి వానిఖడ్గమునే తీసి

కొని శిరమును దెగవైచితిని. తచ్ఛిరమును దమమ్రోల వైచి యున్నాఁడను.

రాజు—ఆహా! హా! హా! నీ సాహస మత్యద్భుతము. ఇఁక నీవు నాకడనే వసించుచు సైన్యాధిపతివిగా నుండుము. నేఁడు నీ వింటికిఁ జనవలదు.

యోనాతాను-బాలకా! నేను సౌలుకుమారుఁడను. నేటి నుండి నా చెలికాఁడవుగను, ప్రాణమిత్రుఁడవుగను నుండుము. మఱియు నా పుట్టమును, ఖడ్గమును, భల్లమును, దట్టీని బహుమతిగాఁ బడయుము.

రాజు—చిఱుతఁడా! నీ శూరతయు, సాహసకార్యమును, ప్రశంసనీయమై జగద్విఖ్యాతి మగుఁగాక. మన మెల్లర మును యెహోవ దేవునకు వేఁడుదము. దావీదూ! నా పుత్రికనిచ్చి పరిణయము గావించెదను. (నిష్క్రమింతురు.)

గద్య.

ఇది యెహోవాదేవుని యేకపుత్రుఁడును జగద్రక్షకుఁడును నగు యేసునాథుని రక్తసిక్త పాదయుగళధ్యానపరతుఁడును, సకల విబుధజనవిధేయుఁడును, విమలవాటి వాస్తవ్యుఁడును ప్రస్తుతము భావపురియందలి అమెరికన్ తెలుఁగు బాప్టిస్టు మిషన్ బోధనాభ్యసనశాలా సహోపాధ్యాయుఁడును, బండారు వంశపయఃపారావార సుధాకరుఁడై కీర్తిశేషుఁడగు పెద యోహానుగారి పుత్రుఁడును నగు మోషే. చేఁ బ్రణీతంబైన గర్వభంగమను ఫిలిస్తీయుని వధ సర్వము సంపూర్ణము.

Copies can be had from

Rev. V. GEORGE,

BEZWADA.

or THE AUTHOR.

గ్రంథకర్తకుగాని

రెవ. వి. జార్జిగారు,

బెజవాడకుగాని

వ్రాసిన లభించును.

